(బి) వివరణముయొక్క కలము (బి) కి బదులుగా క్రింద పేర్కొనిన కలము ఉంచబడగలదు, అనగా :—

"(బి) ఒక సభ్యుని, గత సభ్యుని లేక మృత సభ్యునిచే లేక పరిపాలక సంఘముచే లేక ఎవరైన అధికారి, ముక్త్యారి లేక ఉద్యోగి లేక ఏదైన గత పరిపాలక సంఘముచే లేక ఎవరైన గత అధికారి, గత ముక్త్యారు లేక సంఘము యొక్క గత ఉద్యోగిచే ఏదైన వ్యవహారము చేయబడిన లేక చేయబడుట లోపింపబడిన కారణమున ఆ సంఘముచే అనుభవింపబడిన నష్టము మూలమున ఒక రిజిస్టరు చేయబడిన సంఘము వలని హక్కు ప్రతిపాదన,".

3. సదరు చట్టముయొక్క పరిచ్ఛేదములు ౫౦ మరియు ౫౧ పరిచ్ఛేదములకు మారుగా క్రింద పేర్కొనిన పరిచ్ఛేదములుంచబడగలవు, అనగా :—

హైదరాబాదు శాసనము సంఖ్య ౧౬, సం. ౧౯౫౨ లోని పరిచ్ఛేదము ౫౦ మరియు ౫౧నకు మారుగ క్రొత్త పరిచ్ఛేదముల నుంచుట.

'మధ్యవర్తిత్వము అభిప్రాయమునకై పంపబడిన వివాదము రిజిస్ట్రారుచే ఉపసంహరింపబడుట.

౫౦. విధింపబడు అట్టి షరతులకు లోబడి, రిజిస్ట్రారు పరిచ్ఛేదము ౪౯ యొక్క ఉప-పరిచ్ఛేదము (౧) యొక్క కలము (బి) ననుసరించి అతనిచే మధ్యవరులకు అభిప్రాయార్థము పంపబడిన ఏదైన వివాదమును ఉపసంహరించుకొనవచ్చును మరియు పరిచ్ఛేదము ౪౯ యొక్క ఉప-పరిచ్ఛేదము (౧) లో విధింపబడిన విధానమున దానిని గురించి వ్యవహరింపవచ్చును.

పునర్విమర్శ.

౫౧. (౧) వివాదమునకు చెందిన కక్షిదారు దరఖాస్తుపై లేక తాను స్వయముగా రిజిస్ట్రారు, మధ్యవర్తి లేక మధ్యవర్తులచే పరిష్కరింపబడిన దావా లేఖ్యముల తెప్పించవచ్చును మరియు ఆ దావాలో అతడర్హమని తలంచు ప్రకారము తీర్పు వ్రాసంగవచ్చును.

(౨) వివాదమునకు చెందిన కక్షిదారుచే దరఖాస్తు దాఖలుచేయునిమిత్తము లేక రిజిస్ట్రారుచే స్వయముగా లేఖ్యములు తెప్పించుకొను నిమిత్తము, కాలనిర్ణయ వ్యవధి, మధ్యవర్తి లేక మధ్యవర్తులచే దావా పరిష్కరింపబడిన తేదీనుండి ముప్పదిదినములుండగలదు.

(3) పరిచ్ఛేదము ౪౯ యొక్క ఉప-పరిచ్ఛేదము (౧) యొక్క కలము (ఎ) ను అనుసరించి లేక ఈ పరిచ్ఛేదము యొక్క ఉప-పరిచ్ఛేదము (౧)ని అనుసరించి రిజిస్ట్రారుచే ఒసగబడిన ఏదైన తీర్పు అంతిమముగా నుండగలదు మరియు ఏదైన దివానీ లేక భూమ్యాదాయ న్యాయస్థానమున అధిక్షేపింపబడదు.

(౪) పరిచ్ఛేదము ౪౯ యొక్క ఉప-పరిచ్ఛేదము (౧) లోని కలము (బి) ని అనుసరించి అభిప్రాయార్థము పంపబడిన వివాదమునకు సంబంధించిన మధ్యవర్తి లేక మధ్యవర్తులచే ఒసగబడిన ఏదైన తీర్పు ఉప-పరిచ్ఛేదము (౧) లో విధింపబడిన ప్రకారము తప్ప, అంతిమమై ఉండగలదు మరియు ఏదైన దివానీ లేక భూమ్యాదాయ న్యాయస్థానమున అధిక్షేపింపబడదు."

౪. సదరుచట్టముయొక్క పరిచ్ఛేదము ౫౯ లోని "పరిచ్ఛేదము ౪౭ ని అనుసరించి" అను మాటలకును "లేక పరిచ్ఛేదము ౫౬ లేక ౫౭ను అనుసరించి అభిప్రాయార్థము పంపబడిన మీదట" అను మాటలకును నడుమ నీ క్రింద, పేర్కొనిన పదములుంచబడగలవు :—

హైదరాబాదు శాసనము, సంఖ్య ౧౬ సం. ౧౯౫౨ లోని పరిచ్ఛేదము ౫౯ యొక్క సవరణ.

"లేక పరిచ్ఛేదము ౫౧ క్రింద పునర్విమర్శ ననుసరించి"

౫. సదరు చట్టములోని పరిచ్ఛేదము ౬౦ యొక్క ఉప—పరిచ్ఛేదము (౧) లో "పరిచ్ఛేదము ౪౭ని అనసరించి అభిప్రాయార్థము పంపబడిన వాదములో ఒసగబడిన ప్రతి ఉత్తరువు" అను పదములకు తరువాత క్రింద పేర్కొనిన పదములుంచబడగలవు :—

హైదరాబాదు శాసనము, సంఖ్య ౧౬, సం. ౧౯౫౨ యొక్క పరిచ్ఛేదము ౬౦ యొక్క సవరణ.

"పరిచ్ఛేదము ౫౧ క్రింది పునర్విమర్శన ననుసరించి ఒసగబడిన ప్రతి ఉత్తరువు"

## ఉద్దేశముల మరియు కారణముల నిరూపణి (స్టేటుమెంటు)

హైదరాబాదు సహకార సంఘముల శాసనము, సం. ౧౯౫౨ యొక్క పరిచ్ఛేదము ౪౭ లో, గత సమితి లేక సహకార సంఘము మున్నగు వానియొక్క గత అధికారి, ప్రతినిధి, పరిచారకునికి సంబంధించి కలుగు ఒక వివాదమును గూర్చి సూచన లేదు. ఈ లోపమును సవరించుటకు, మరియు అట్టి వివాదముల మధ్యవర్తిత్వము (పంచాయితి) నకు అభిప్రాయార్థము పంపు అధికార క్షేత్రమును సహకార సంఘముల రిజిస్ట్రారునకు నొసంగుటకై, మద్రాసు విధానముపై హైదరాబాదు సహకార సంఘముల శాసనము సం. ౧౯౫౨ యొక్క పరిచ్ఛేదము ౪౭ను సవరించుటకు మరియు ఈ శాసనముయొక్క పరిచ్ఛేదములు ౫౦,౫౧,౫౯, మరియు ౬౦ లో తత్ఫలితముగా కొన్ని సవరణల నొనర్చుటకిప్పుడు ప్రతిపాదింపబడినది.

సదరు ఉద్దేశము దృష్ట్యా ప్రస్తుత చిత్తు చట్టము తయారు చేయబడినది.

తేదీ ౩౧వ ఆగస్టు, ౧౯౫౫.

మెహిదినవాజ్ జంగ్

---

(రాజప్రముఖు ఆజ్ఞచే ప్రచురింపబడినది)

హైదరాబాదు, తేదీ ౩౧వ ఆగస్టు, ౧౯౫౫.

చంద్రకాంతరావు గోడ్బే,

లీగల్ రిమెంబరెన్సరు మరియు
ప్రభుత్వ న్యాయశాఖా కార్యదర్శి.